# కాంతిశిఖరాలు



కళాప్రపూర్ణ
ఆంధ్రసరస్వతి
డా. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

కాంతిశిఖరాలు

కవయిత్రి: డా. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

ప్రథమ ప్రచురణ
జులై 1978



మూల్యము
రు. 5-00

ముద్రణ:
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమండ్రి

సహృదయ హృదయశిరోమణి

పరమఆస్తిక్యభావార్ద్ర సంస్కారులు

శిరీషకుసుమపేశల కవితామూర్ధన్యులు

మహాకవులు, సోదరులు

కళాప్రపూర్ణ

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారికి

అంకితము

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ

విద్యాసాంస్కృతిక శాఖవారి

సాహాయ్యమునకు

కృతజ్ఞతలు

## ప్రార్థనాంజలి

రసప్రచురరుచిరమైన ప్రార్థనాహృదయంతో అంజలి బంధించి పరమ పిత పదసన్నిధిని రవంత తడవు గడిపితే — — అబ్బా, ఓహ్, ఆ పార వశ్యం! — — వెలలేనిది? తులలేనిది! వేయిజీవితాల్ని అనంతకాంతుల శిఖరాలపై నిలిపి ఉన్నత పఱచేది!

ఆమహాభాగ్యాన్ని వర్ణించడానికి ఇంతవరకు ఏభాషాజలధినిత్రచ్చి తెచ్చిన అమృతరాసులూ అసమర్థాలేయై "యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసానహ" అని ఊరకొన్నవే.

ఊరడిల్లుట చేతకాక, బాధాతప్త హృదయానికి ఉపశమనం లభించక, ఉపనిషన్మందిరాంతశ్శయనుడైన పరమేశుని ఉపచారం కొంతైనా నెరవేర్చు కొని అంతరాంతరాల్లోని చిమ్మచీకటిని పారద్రోలాలనీ, ఉషఃకాంతులను పుక్కిలి బట్టిన తూరుపు తొయ్యలితో బాటు ఉదయారుణ సంధ్యాసూక్తాన్ని పఠించడానికి దోయిలి పట్టాలనీ నిత్యమూ పడే నా ఆరాటానికి నేను కల్పించుకొన్న రసప్రచుర రుచిరాకృతి! ఈకృతి!

మాన్యులు మధురకవి మూర్తుల నామము కృష్ణరావుగారు నాపితృపాదులు. సరసకవితారసావేశనిర్భరులై ఆంధ్రసరస్వతి కెట్టి తీవ్రతతో వారు పరిచర్య సల్పినారో, అంతటి ధర్మావేశమూ వారిచే సంఘసంస్కారనిర్వాహకమునే కాక బ్రాహ్మపద్ధతి పూజావిధిని నిర్వహింప జేసినది. అట్టి ఉన్నత హృద్గయ చైతన్యమే వారిని ఆంధ్రభాషాసేవకు దేశసేవకు పురికొల్పి ఉసురులున్నంత వఱకు ఊరట లేని గుంజాటనముతో గౌతమీసద్గ్రంథనిలయ పూజారితనము కొనసాగించుటకై మరులు కొల్పినది!

వారి కొమరితనైన నాకు బాల్యము నుండియు బ్రహ్మోపాసనాప్రార్థనా దికము రుచిమంతమై నా లేతయెదదలో నును కాంతుల ప్రసరింపజేసి శిఖర ప్రతిష్ఠ నంది తిష్ఠ వేసినది. అది అంతటితో ఆగక మాపెదనాన్నగారు నామము రామలింగ

యార్యుడు స్థాపించిన వైశ్యసేవాసదనంలో విద్యనభ్యసించే తరుణంలో బ్రహ్మ సమాజాచార్యులు శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయ సద్గురులు వారము వారము మా విద్యా మందిరానికి విచ్చేసి,

"నేడు మన మందఅము కూడి
పాడుదము పరమేశుని........ .. అనే

కీ ర్తనను, "ఈగడ్డిపూవులే ఈదారిపొంతనే
ఎండిపోసీవోయిదేవా
నీయిష్టమైనచో నీపూలదండలో
నిండిపో నీవోయిదేవా......... ....." అనే

కీ ర్తనను, ఇంకా అనేకములైన బ్రహ్మసమాజ కీ ర్తనలను తన మంద్రగంభీర గళరవం పొంగులువారగా పాడేవారు. ఆనాడే నాపసిహృదయం అప్రశాంతమధుర గంభీరరసవాహినిలో మునిగి ఆజలధిలోతులలో లభించే నవరత్ననిధులను కైవసం చేసుకొని భద్రపఱచుకొన్నది.

మేము నిత్యమూ ప్రార్థనా సమయంలో హృదయశంఖమూది గళమెత్తి కీర్తనచేసే ఆ చిక్కని భక్తిగీతాలలో మిక్కిలి చక్కనిదైన "ఈగడ్డిపూవులే ఈదారిపొంతనే" అనేకీ ర్తన సోదరులు ఏకాంతభక్తిపరవశులూ ఐన శ్రీ దేవుల పల్లి కృష్ణశాస్త్రిగారి రచన అని తెలుసుకొన్నప్పుడు అప్పటినుండి అస్తి త్రభక్తిపరతంత్ర సంస్కారులైన శ్రీ కృష్ణశాస్త్రిగారిపై నాకు కల్గిన పరమాదరం చెప్పనలవి కానిది. ఆశ్రద్ధ నన్ను వెనుతఱుమగా నేను శ్రీ కృష్ణశాస్త్రిగారి ప్రార్థనాగీతాల కొఱకు తహతహలాడేదానను.

"కాంచలేను కాంచలేను
కనులు మూతలువడునుదేవా" అనే

కృష్ణశాస్త్రిగారిగీతం, ఎప్పుడూ నా అంతర్యపు దొంతరలోనిండి రాగతరంగితమై గీతికాప్రసూనాలతో సర్వేశ్వరుని పాదారవిందాలకడ మోకరిల్లే చైతన్యస్పృహను మోసులెత్తింపచేసింది.

కాలాంతరంలో మద్రాసురేడియో 'ఆంధ్రసాహిత్యం భక్తికవితా ప్రాధాన్యం' అనే శీర్షికపై ప్రసంగించమని నన్ను కోరినపుడు ఆప్రసంగ వ్యాసంలో ప్రధానంగా కృష్ణశాస్త్రిగారి కీర్తనా సాహిత్యమే నాకు ఉపకరించింది. ఆప్రభావంతోనే నేను ఆప్రసంగంకొఱకు

"నీలోని మార్దవము నేనై
నాలోని వైభవము నీవై
నిఖిలమా లోకాలు
నిండివెల్గెదమోయి ॥ఈశా॥

అనేకీర్తనా రచన చేశాను.

అదిమొదల్గు ఎన్నోకీర్తనలను నేను ఆవిధంగా రచించి తన్మయంగా పాడుకోవడం నానిత్య జీవనవిధిగా, అనభ్యస్త విద్యగా అలవడి పోయింది.

ఈ గీతికా రచనకు నాకు శక్తినిచ్చిన సోదరులు, అత్యంతికపరభక్తి పరిపక్వచేతనా సౌందర్యతేజోమండితులు, ఆస్తిక్యభావనాపరవశులూ, ఏశేశ్వరోపాసనాపులకితాంతరంగులూ అయిన శ్రీకృష్ణశాస్త్రిగారికే ఈ కృతిరత్నము నొసంగుట పరమమైన కర్తవ్యమని వారికే ఈకృతినర్పించాను. వారుస్వీకరించడం నాభాగధేయం.

వారి దీవనతో ఈకృతి సంతమసాన్ని చీల్చిచెండాడి, ఆంధ్రుల హృదయాల్లో కాంతిశిఖరమై సుప్రతిష్ఠిం కాగలదు.

ఇంకొక్కమాట కళాప్రపూర్ణులూ, కవితాగగనరంగంలో నిండు జాబిల్లి అయిన మహాకవులు సోదరులు కళాప్రపూర్ణులు శ్రీ సి. నారాయణరెడ్డిగారు నాపై ఆదరముంచి ఈకృతివిపంచిని శ్రుతులు సవరించి రాగసాధనకై ఆయత పఱచినారు. వారికి సాదర ప్రణామాంజలి.

తమసోమాజ్యోతిర్గమయ
మృత్యోర్మామమృతంగమయ

కళాప్రపూర్ణ
డా. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

# రాగారాధన

డా॥ సి. నారాయణరెడ్డి

రక్తికైనా భక్తికైనా ఆత్మసమర్పణం సమాన ధర్మం. రక్తి రజ్జువులో ముడిపడేది ప్రేయసీ ప్రియులైతే భక్తిసూత్రంలో కట్టుపడేది భక్తుడూ పరమేశ్వరుడూ. భక్తిభావన రాగతరంగితమైతే, గీతప్లావితమైతే ఆ ఆరాధన మనన రమ్యం : స్మరణ కామ్యం.

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు వైదుషిని పండించుకున్న శేముషీమతి. బాల్యంలో ప్రసరించిన బ్రహ్మసమాజ ప్రభావ ప్రభలు ఇన్నాళ్లూ అంతరంగంలో దొంతరలు దొంతరలుగా దోబూచులాడి నేటికి ఈ సంపుటిలోని గీతాలుగా రూపొందినవి. ఈ గీతాల్లోని స్వామి, రాజు, అందగాడు ఆ దేవదేవునికి పర్యాయనామాలే. ఆ దేవదేవుడు కూడా ఏకంగా నిర్గుణంగా, భాసించే అరూపరూపుడే.

ఇవి పాడుకునేటప్పుడు రక్తికట్టే గీతాలైనా, వీటిలో చదివేటప్పుడు కూడా కవిత్వం జుమ్మనిపించే పంక్తులూ ఉన్నాయి.

'తడివోని కనులతో
ఉడివోని తలపుతో'

అన్నప్పుడు ప్రాససౌందర్యంతోపాటు ఆర్ద్రభావన తొంగి చూస్తుంది.

'మధువు దోసిట బూని
మందార హృదయమ్ము
ప్రమదకు దోయిలి బూని,
ప్రార్థనా హృదయమ్ము'

అనే పంక్తుల్లోని భావచిత్రాలు ఉత్తమ కవితాత్మను పుక్కిట పట్టుకున్నవి.

'వింగిళ్ళలను నిండు నాస్వామి నిన్నెపుడు
పిల్లతెమ్మెరనై అల్లుకొనియేను'

అనే పాదంలోని ఊహ అత్యంత వినూత్నం. ఇంతకాలం లతలా అల్లుకోవడముంది. పిల్లగాలిలా అల్లుకోవడం సుతి మెత్తని నవ్యత.

బాల్యంలో దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి బ్రహ్మ సమాజ గీతాలు విన్నప్పుడు కలిగిన అనుభూతులను గీతులుగా మలచుకున్నామని లక్ష్మీ కాన్తమ్మగారన్నారు.

'తుడువకె కన్నీరు చెలియా' అనే గీతంలో కృష్ణశాస్త్రిగారి 'కురియుమురా కన్నీరును' అనే గీతం ప్రభావం స్ఫుటంగా కనిపిస్తున్నది. శాస్త్రిగారి ప్రభావంతో వెలువడిన గీతాలను వారికే అంకితం చేయడం శరధినీరులు పయోధరములు కొని తెచ్చి, మళ్లీ వర్షా రూపంలో ఆ శరధిలోనే కురిసినట్టుంది. ఈ రూపకంగా శాస్త్రిగారి 'అప్పు' తీర్చుకున్నందుకు లక్ష్మీకాన్తమ్మగారు అభినంద్యులు.

---

కాంతిశిఖరాలు

# ఎందుకో నామనస్సెందుకో

ఎందుకో నామనస్సెందుకో
నిను తలచి పులకించు
ఎందుకో నామనస్సెందుకో
నినుతలచి పులకించు.

నీగుణము మాధనము
నీచరిత మాకవిత
నీత్యాగమే గానమై
ఎదల నుప్పొంగించు

ఎందుకో నామనస్సెందుకో
నినుతలచి పులకించు.

నీప్రకృతి మా సుకృతి
నీవినుతి మాప్రగతి
నీనుతియె సుగతియై
బ్రదుకు పండుచేను

ఎందుకో నామనస్సెందుకో
నినుతలచి పులకించు.

నీమూర్తి మాస్ఫూర్తి,
నీ దీప్తి మాకీర్తి
ఆర్తితో నిన్గొలుచుటే
జీవితధ్యేయమా

ఎందుకో నామనస్సెందుకో
నినుతలచి పులకించు.

ఎందుకో నామనస్సెందుకో

జాతిలోపల ప్రీతి
ప్రాణులోపల మమత
నదులలో జీవనము
కడలిలో స్పందనము

ఎందుకో నామనస్సెందుకో
నినుతలచి పులకించు.

ఈ విశ్వ రీతిలో
ఈ వివిధ ప్రకృతిలో
నీవికాసమె శశ్వ
త్ప్రకాశమై యలరు

ఎందుకో నామనస్సెందుకో
నినుతలచి పులకించు.

ఇందు నందున గాక
ఎందెందునన్ గాని
ముందు ముందుకు మమ్ము
నడపించు నందుకో

ఎందుకో నామనస్సెందుకో
నిను తలచి పులకించు.

# నిఖిలమౌ భువనాలు
# నిండి వెల్గెదమోయి

నీలోని మార్దవము నేనై
నాలోని వైభవము నీవై

నిఖిలమౌ భువనాలు
నిండి వెల్గెదమోయీ ఈశా

కదలిలోతులు తడచి
కడల యెల్లలు చదచి

నిండారి భావత
రంగాలు శబలింప

సంభ్రమించెద మోయీ
విభ్రమించెద మోయీ
విధి విరామము లేక ఈశా

నీలోని మార్దవము నేనై
నాలోని వైభవము నీవై
నిఖిలమౌ భువనాలు
నిండి వెల్గెదమోయీ ఈశా

చూపుచూపులు లేక
పలుకు పలుకులు లేక
నిశ్చలమౌ నీరవమౌ
నిబిడ హృత్సీమలతో

నిలిచి పోదమటోయీ
విలుచు కొందమటోయీ
విపుల జగతీ సారము నీశా
నీలోని మార్దవము నేనై
నాలోని వైభవము నీవై
నిఖిలమౌ భువనాలు
నిండి వెల్గెదమోయీ ఈశా

అంతయును ఏకమై
అన్నియును ఒకటియై
అంతరంగము నిండ
అంతర్ముఖులమై

అనంత పదసీమ
ఆనంద ధామాలు
అల్లుకొంద మటోయీ ఈశా

నీలోని మార్దవము నేనై
నాలోని వైభవము నీవై
నిఖిలమౌ భువనాలు
నిండివెల్గెదమోయీ ఈశా.

# నీయెుక

యెటుక  యందేను ఉన్మేషితనగుదు
నీదీప్తిలో నాకనులు ఉన్మిషిత చెందు
నీఅభయ సామ్రాజ్య దివ్యసన్నిధి నన్ను
సుఖియింప గొంపొమ్ము ఓదేవ దేవ

నీయెటుక యందేను ఉన్మేషిత నగుదు
నీయెటుకలో నాకనులు ఉన్మిషత చెందు

ఎచ్చోట ఈ అతుకు బొతుకుల బొంత
దరిని జేరగలేదొ ఆదివ్యసీమ
సుఖియింప గొంపొమ్ము ఓదేవ దేవ
అదియె పదివేలౌను నాపాలికోదేవ

నీయెటుక యందేను ఉన్మేషిత నగుదు
నీ దీప్తిలో నాకనులు ఉన్మిషత చెందు

ఏచోట ఈపాట పాచ్చెముల బ్రదుకు
దరియ జేరగరాదో ఆ ప్రేమ సన్నిధికి
సుఖియించ గొంపొమ్ము ఓదేవదేవ
ఇదియ నాప్రార్థనమ్మోయి దేవ

నీయెఱుక యందేను ఉన్మేషిత నగుదు
నీదీప్తిలో నాకనులు ఉన్మిషత చెందు

ఏచోట నీకరుణ జలత లెపుడు
శమియించునో ఆ ప్రశాంత వాటికిని
సుఖియింప గొంపొమ్ము నన్నోయిదేవ
ఇదియ నీప్రసాదమ్మోను ఓదేవదేవ

నీయెఱుకయందేను ఉన్మేషితనగుదు
నీదీప్తిలో నాకనులు ఉన్మిషత చెందు

ఏచోట ఈదుర్విషయ జలధు లన్నియునింకి
అణగి పోవుచునుండు నాయానందసీమ
సుఖియింప గొంపొమ్ము ఓదేవదేవ
అదియె పదివేలు నాపాలికో దేవ ॥

నీయెఱుక యందేను ఉన్మేషిత నగుదు
నీదీప్తిలో నాకనులు ఉన్మిషత చెందు,

# అలరిన మనసు

అలరిన మనసున అలరులు విరిసెనే
కలలవితేలియు కళలై మెఱసెనే

అలరిన మనసున అలరులు విరిసెనె

ప్రభుని సంస్మరణము విభవము గూర్చెనే
అభయహస్తమ్మే ఆశ్రయమిచ్చెనే

అలరిన మనసున అలరులు విరిసెనే

చెలువుని పొడగన పులకలు మొలచెనె
కలికి పలుకుల నమృతము చిందెనె

అలరిన మనసున అలరులు విరిసెనె

వాల్గన్నులలో వలపులు కురిసెనె
వాల్లభ్యమునన్ డెందము మురిసెనె

అలరిన మనసున అలరులు విరిసెనె

చల్లని స్పర్శను స్వర్గమె యరలెనె
మెల్లని తలపున కుల్లము పొంగెనె

అలరిన మనసున అలరులు విరిసెనె.

# ఆగలేను సాగలేను

ఆగలేను సాగలేను
ఆగి సాగి తూగలేను

ఆగడమ్ములతో బ్రదుకంతా
వేగి పోయెనోయి దేవ
వేగిరమె నీకరుణలేక
ఆగమరూప భవసాగర మీదలేను
ఆగలేను సాగలేను
ఆగిసాగి తూగలేను —

ఆడలేను పాడలేను
ఆడిపాడి వేడలేను
కీడువడుచు జీవనలత
వాడిపోయెనోయి దేవ
ఆడబోవు తీర్థమటుల
ఆదరించి బ్రోవకున్న
ఆగలేను సాగలేను
ఆగిసాగి తూగలేను

పిలువలేను నిలువలేను
పిలిచి, నిలిచి కొలువలేను
విలువలేని జీవిత మిటు
పలిగిపోయెనోయి దేవ
పలుకరించి వలపు నాపై
చిలుకరింపకున్న నింక
ఆగలేను సాగలేను
ఆగిసాగి తూగలేను

కోరలేను దూరలేను
కోరి, దూరి, చేరలేను
దారిచూపు వారులేక
ఘోరతమము పాలబడితి
నివారితా భయహస్తమిచ్చి
దారి నీవు చూపకున్న
ఆగలేను సాగలేను
ఆగిసాగి తూగలేను -

ప్రత్యయమ్ము చూపలేను
గత్యంతరమైన లేదు
సత్యకాము డీవుతండ్రి
శాశ్వతుండ వీవుతండ్రి
నిత్యమనంతమౌనీదు కరుణ
అత్యంతము లభియింపకున్న
ఆగలేను సాగలేను
ఆగిసాగి తూగలేను -

# తుడువకే కన్నీరు

తుడువకే కన్నీరు చెలియా
తుడువకే, తుడువకే
జడిజడి జల్లులై
జలజల పారనీ
తుడువకే కన్నీరు చెలియా

పొరలేటి కన్నీటి
కెరటాలు సు[illegible]న
ఎదలోని బెడదల
నెల్లెఱుగు నాస్వామి
తుడువకే కన్నీరు చెలియా

తడిఁబోని కనులతో
ఉడిపోని తలపుతో
ఉడుగని వెతలతో
అడుగుకొన నీవె నాస్వామి

తుడువకే కన్నీరు చెలియా

నిదుర వేగిన కనులు
ప్రిదిలిపోయిన మనసు
కననీవె నాసామి
కనువేదురులు వెలగ

తుడువకే కన్నీరు చెలియా

కనులవెంబడి కసలు
కరగి కరగుచు పార
అమలమౌ నాహృది
నధివసించునో అపుడు

తుడువకే కన్నీరు చెలియా

కనుల మెలగెడి విభుడు
కన్నీటి జాలులో
ప్రతిఫలింపగ జూచి
పరవసింపగనీవె

తుడువకె కన్నీరు చెలియా
తుడువకే, తుడువకే.

# నీ కరుణ లేక

కరుణలేక
మనగలనా ప్రభూ - నీ
కరుణలేక
మనగలనా
అరుణారుణమౌ నీ
హస్తపల్లవమ్ము నీడగాక
మనగలనో - ప్రభూ - నీ
కరుణలేక మనగలనో

జాతిమీద జీవములు చిలికి
నాతిని జేసిన నీకృపకై
ప్రీతిని పాతరలాడక
ఏబ్రాతిని నేనిక మనగలనా - ప్రభూ - నీ
కరుణలేక మనగలనో

ఎంగిలొసంగిన అంగనకే
కేలొసంగిన నీకృపకై
అంతరంగము నొసంగక
ఏతెలంగున నేనిక మనగలనా - ప్రభూ - నీ
కరుణలేక మనగలనా -

కలుషభరముడిపి
శిలలను తేల్చిన నీకృపకై
పలుమఱు పలవరింపక
ఏలీలను నేనిక మనగలనా -ప్రభూ-నీ
కరుణలేక మనగలనా.

# నీకై చేర్చితి నీ మధువు

నీకై చేర్చితి నీ మధువు, నే
నీకై చేర్చితి నీ మధువు
ప్రాణ రాగ రసము లొడిచి
తేర్చిన జీవన మధువు
నేనీకై చేర్చినీమధువు.

ఏ నెఱుంగ గ్రహియింతువో
విగ్రహింతువో
ప్రాణనాథ ఈ నివేదనమె
నాకు మురువు
నే నీకై చేర్చితి నీమధువు.

బ్రదుకు ద్వారమై
భవదాగమన వాంఛమై
వేయి కనుల వేచి యుండె
రేయి పవలు
నే నెఱుంగ నిందించెదవో
అభినందించెదవో
జీవితేశ వితలు సేయగాదు
నీకు పడువు
నే నీకై చేర్చితి నీమధువు,
మధుర భావనలమాలయై
పరవశించితి నీపదసన్నిధిని
ఏ నెఱుంగ కరముల నొత్తెదవో
ఉరమున హత్తెదవో
మధుర భావుక అనురాగమె
నాకు హరువు
నే నీకై చేర్చితి నీమధువు.

# రాలిన పూవుల రాగమాలిక

రాలిన పూవుల రాగమాలిక లల్లెదవో
అల్లిన మాలిక నాగళ సీమను
పొలుపొందు నాకో
రాలిన పూవుల రాగమాలిక లల్లెదవో
జారిన తేనెల కలకండలు
సేసెదవో
చేసిన కండలు ఆస్వాద్యము
లౌనాకో
రాలినపూవుల రాగమాలికలల్లెదవో
చెదరిన యెదలను చేరిచి
అది కెదవో
అదికిన యెదలవి ఆనందాబ్ధు
లౌనాకో
రాలినపూవుల రాగమాలికలల్లెదవో.

# ఏమని పొగడుదుర

ఏమని పొగడుదుర స్వామీ నీకరుణ
ఏమని పొగడుదుర

పండువెన్నెల సొగసు, నిండుచీ[illegible]హాసు
ఏకమై భాసించు నాకమున చేర్చితివి
ఏమని పొగడుదుర స్వామీ నీకరుణ

గుణము అవగుణమ్ము, పుణ్యము, పాపము
స్తుతియు నిందయును, రాగము ద్వేషము
ఏకమై భాసించు నాకమున నను జేర్చితివి
ఏమని పొగడుదుర స్వామీ నీకరుణ

చీకటి వెలుతురు, సుఃఖము దుఃఖమును
పుట్టుట గిట్టుట శాశ్వతచక్రమై
ఏకమై భాసించు నాకమున నను జేర్చితివి
ఏమని పొగడుదుర స్వామీ నీకరుణ

నీదరిని వసియించి, యీ జీవితపు సొగసు
నీచైతన్యమ్మదు ధారా వాహికగ భావించి
అద్భుతాశ్చర్య పరవశత నొందుచును తిలకింత
ఏమని పొగడుదుర స్వామీ నీకరుణ

# ప్రణయ తపస్విని

కలతనిదురలు, కలవరమ్ములు
వెలది నీదగు భాగ్యవిభవము
వలపు లెఱుగని వల్లభునకై
వంతగ్రాగిన ఫలమటె !

తిలకమ్మల్లన చెదరిపోయెను
కనులకాటుక కఱగిపోయెను
పెదవులల్లన బెదరుచుండెదు
ఎదల వలపులు వ్యథకటె !

దెసలచూచుచు ఉసురువిడచెదు-
బెగడుగుడుచుచు అగడు సేసెదు
ఊరడించిన ఉలికిపడియెదు
ఉమ్మలికమ్ములూరటకె ?

విభునిగుణగణవిభవగానము
భాగ్యమిచ్చునె పడతినీకును !
విభుని స్మరణనె భవముగడపెదు
విధముకాదని యెఱుగనె ?

ప్రణయమెఱుగని ప్రభునిపదముల
బ్రదుకు హారతి కపురమాయెను
తపసుపండని ప్రణయతపసివి !
పరులు నవ్వటె ఫలమటె !

కలతనిదురలు కలవరమ్ములు
వెలది నీదగు భాగ్య విభవము
వలపులెఱుగని వల్లభునకై
వంతగ్రాగిన ఫలమటె.

# నీ దయ కరుణ

ఈశ నీదుకరుణ
కెపుడు పాత్రమౌదునో
ఈశ్వరా
నశ్వరమ్ము లీసుఖముల
నశ్వరమ్ము నీదుకరుణ
ఈశ నీదుకరుణ
కెపుడు పాత్రమౌదునో
ఈశ్వరా

పాప తిమిరమౌను జగతి
భాస్వదమల జ్యోతి నీదుకరుణ
ఈశ నీదు కరుణ
కెపుడు పాత్ర మౌదునో
ఈశ్వరా

దుఃఖ దగ్ధమౌను ప్రకృతి
ప్రావృడంబు వృష్టి నీదుకరుణ
ఈశ నీదుకరుణ
కెపుడు పాత్రమౌదునో
ఈశ్వరా

మ్లానమలిన సుమము భవము
మ్లాన సుధాధార నీదుకరుణ
ఈశ నీదుకరుణ
కెపుడు పాత్రమౌదునో.
ఈశ్వరా.

# ఏలికవు నీవు ప్రభూ

ఈ నిఱుపేద జీవికకు ఏలికవు నీవుప్రభూ
ఈచిఱుగుండెవలచు ప్రణయమాలికవు నీవుప్రభూ
నీమృదుపాద వరివస్య పరవశింపగనీవెప్రభూ
నీప్రేమసన్నిధి నొాదలుపులకరింపగ. నీవెప్రభూ
ఈనిఱుపేదజీవికకు ఏలికవు నీవుప్రభూ

నీతపమ్మునందె బ్రతుకు వేగిపోనీవె ప్రభూ
నీమధురహాసములోన కఱగిపోనీవెప్రభూ
ఈనిఱుపేదజీవికకు ఏలికవు నీవుప్రభూ

నీ నిరీక్షణయందె మనసు చిద్రుపలుగానివెప్రభూ
చిదురు చిదురునన్ నీరూపుకాంచి మురియగనీవెప్రభూ
ఈనిఱుపేదజీవికకు ఏలికవు నీవు ప్రభూ

నీకన్దోయికాంతికై కృశియింపగానీవెప్రభూ
నీఅభయ హస్తముకోరి అంజలింపగనీవెప్రభూ
ఈనిఱుపేద జీవికకు ఏలికవు నీవు ప్రభూ

నీమధురవీక్షణకునై పడియుండ నీవెప్రభూ
ఈమేను కండలుగకోసి కానుకీయగ నీవె ప్రభూ
ఈనిఱుపేద జీవికకు ఏలికవునీవుప్రభూ

ఈకమలకోరకము వెలుగు కిరణమాలికవు నీవుప్రభూ
ఈశీర్ణజీవితరేఖదిద్దు వర్ణతూలికవు నీవుప్రభూ
ఈనిఱుపేదజీవికకు ఏలికవు నీవుప్రభూ

# జీవన శిశిరము

జీవితమంతా శిశిరంబేనా
జీవించుట యిక చీకటికేనా
జీవితమంతా శిశిరంబేనా

ఏ వెలుగేనియు లేక దుఃఖావిలమయ్యెనే
తావలమై శాంతికి విరిదావులు జల్లుట యెపుడో
జీవితమంతా శిశిరంబేనా

ఏసుఖమేనియు లేక వేసట చెందెనే
విమలహాసరేఖయై మోసులెత్తుట యెపుడో
జీవితమంతా శిశిరంబేనా

ఏమాధుర్యములేకయె వెగటై పోయెనె
వేమఱు నీపద సేవల ప్రేముడి జెందుట యెపుడో
జీవితమంతా శిశిరంబేనా

ఏ అమృత మొల్లక ఆరట మొందెనే
న్యాయమా నీకిటు నన్నల్లరి వెట్టగ
జీవితమంతా శిశిరంబేనా,

# నీవు కాక

నీవుకాక

ఈదుర్బల యాన పాత్రికల
ప్రళయజలధి దాటించు
ప్రబలు రెవ్వరున్నారురా

నీవుకాక

ఈసుమ హృదయ కోశముల

సుమధుర మకరంద రసము

నింపు నిర్భరు లెవ్వరున్నారురా

ఓ దేవదేవ

నీవుకాక

ఈనును లేత పచ్చికల

కడుశీతలమ్మౌ వృష్టి

దడుపు నాధుండెవరున్నారురా

ఓ దేవదేవ

నీవుకాక

ఈ కటికచీకటిపై

నిరుపేద జీవికలపైన

వెలుగు నింపెడు జ్యోతి యెవ్వరున్నారురా

ఓ దేవదేవ

ఏవిద్య నేనెఱుగ నిన్నువేడుటదప్ప

ఏకళల నేనెఱుగ నిన్నునమ్ముటదప్ప

నీలీల నీకరుణ నాకు దిక్కగుదేవ

నీప్రేమ నీదీప్తి శాంతిసౌఖ్యముగూర్చు

నీవుకాక

ప్రభులెవ్వరున్నారురాదేవ .

# చల్లచల్లన రావో ఓ స్వామి

చరలేటి మిల మిలలు
సంతరించిన సంధ్య
సెలయేటి గల గలలు
సవదరించిన సంధ్య

చల్ల చల్లన రావో ఓస్వామి
స్వార్పణం బిదిగోర నా స్వామి

చల్ల చల్లన రావో ఓ స్వామి

మధువు దోసిటబూని
మందార హృదయమ్ము
బ్రదుకు దోయిలి బూని
ప్రార్థనా హృదయమ్ము

పిలిచెనే పల్మాఱు నిన్నోస్వామి
పలుకవే మాతోడ నాస్వామి

మల్లియల పరువమ్ము
పదిల పఱచిన యుషస్సు
పరమేశు నృత్యమ్ము
పరిఢ విల్లిన మనస్సు

నిన్నాలపించెనే ఓస్వామి
విన్నావ యీ మొఱలు నాస్వామి

క్షణిక జీవమ్మురా
ప్రకృతి సౌందర్యమ్ము
చిటిక జితియించురా
జీవమాధుర్యమ్ము

ఆలసించెద వేల ఓస్వామి
అమృతంబీగదవె నాస్వామి

# తలపు సంద్రము

తలపు సంద్రము పెల్లుబికి
త్వత్పాద సన్నిధి జేర
పర్వమయ్యెను నేడు
గర్వమయ్యెను బ్రదుకు
ఓ దేవదేవ
ఓ మహాప్రభావ

నీదివ్య సన్నిధిలోన
శాంతి పెన్నిధి లభియించి
సర్వముం బ్రాపించె
ఉర్వరయె దీపించె
ఓదేవ దేవ
ఓ మహాప్రభావ

నీ కృపా మృతవృష్టి
బడలికలు వాసె
భవబంధములు వీడె
ఆనందమున మేను
తూలికై ఎగసె
ఓదేవ దేవ
ఓ మహాప్రభావ

# క్రొందమిం జిందేటి అందగాడా

క్రొందమిం జిందేటి అందగాడా
ఆనందవాహికను నన్నందుకోరా.
కోటిరేకుల విరియు క్రొందమ్మినై నేను
తేటిపాటల నావలపు నీకు తెలిపేనురా
క్రొందమిం జిందేటి ఓ అందగాడా
ఆనందవాహికను నన్నందుకోరా
కొండకొమ్మల కన్నె గేదంగినై నేను
నిండుగుండెల గ్రుచ్చి కౌగలించేనురా
క్రొందమిం జిందేటి ఓ అందగాడా
ఆనందవాహికను నన్నందుకోరా
విశ్వవిభుడవు నీవు నీయొడిని నేనాదిగి
సెలయేళ్లగా పారిపొంగి సాగేనురా
క్రొందమిం జిందేటి ఓ అందగాడా
ఆనందవాహికను నన్నందుకోరా
నింగినేలనునిండు నాస్వామి నిన్నెపుడు
పిల్లతెమ్మెరనై అల్లుకొనియేనురా
క్రొందమిం జిందేటి ఓ అందగాడా
ఆనందవాహికను నన్నందుకోరా
రాగవసంతుడనీవు భోగవసంతుడవు
శతరాగ రాగిణినై రక్తిమలు చిందేనురా ॥
క్రొందమిం జిందేటి ఓ అందగాడా
ఆనందవాహికను నన్నందుకోరా.

# నా రా జా

వెలుగుబాటల నడచి
వెన్నెలల మెట్లెక్కి
కన్నులలో చంద్రుణ్ణి
కలుసుకొనియేనా నారాజా

కన్నులలో చంద్రుణ్ణి కలుసుకొనియేనా

బ్రతుకుతెరువులలోన
పన్నీరులై పారి
మున్నీరులా ప్రేమలో
కరగిపోయేనా నారాజా,

కరగిపోయేనా ॥

ప్రణయేశు నునుమేని
కాంతి దొంతరలలో
లావణ్య వీచినై
మెఱసిపోయేనా నారాజా,

మెఱసిపోయేనా ॥

మువ్వముత్తెపు రవళినై
మురిపెంపు శోభనై
పరమేశు నృత్యాన
పాదార్చనము చేసేనా నారాజా

పాదార్చనము చేసేనా ॥

హృదయేశ్వరునిదివ్య
ప్రేమసన్నిధి నాదిగి
హాస చంద్రికనై
పరవశమ్మొందేనా నారాజా

పరవశమ్మొందేనా ॥

# ఇదిచాలు నిదిచాలు

ఇదిచాలు నిదిచాలు
ఇంకేదికోరను మేలు
పరమ సౌఖ్యము నీది
పారవశ్యము నాది
జీవితేశ్వరా బ్రదుకు
తేనియలు చిలికి

భవ్యసన్నిధిచేర్చి
పాలింపుమోయి

ఇదిచాలు నిదిచాలు
కేదికోరను మేలు ॥

పాదాభివందనమె
స్వాదు పథమ్మని తలచి
యుగయుగమ్ముల దవిలి
భవము నీదితినెటులో

సేవయేచాలు
భవముపందును మేలు

ఇదిచాలు నిదిచాలు
ఏదియు కోరను మేలు

జీవితేశ్వర కరుణ
చేదుకోవోయీ
కరుణా మరందమె
వరవిభూతి యనితలతు

నీప్రేమ లాభమ్మె
నాకు పదివేలు

ఇదిచాలు నిదిచాలు
ఏదియు కోరనుమేలు.